# రాష్ట్రీయ వార్తలు

## అహింసాప్రబోధము

("గోలకొండ" విలేఖరి)

భువనగిరి అబాను ౨౦

గతశనివారమునాడు బండారు వేసిన దున్నపోతును గ్రామములోని బొడ్డురాయి వద్దనుండి ఊరేగింపుతో మారెమ్మగుడికి తీసికొనివెళ్లి ప్రభుత్వామతిలేనిది పండుగ కొలుచుటకు వీలులేదని గ్రామాధికారులు విరోధించినను ఉద్రేకపూరితులైయున్న ప్రజలు వినుపట్లు లేకుండెను.

ఈసంగతి తెలియుటతోడనే స్థానిక అహింసాప్రచారకులగు శ్రీ డి. అంజయ్య, శే. నరసయ్య, రాంగోపాల్, వెంకటరావుగారలు గుడికేగి అహింసాప్రభావమును విశదపరచిరి అందువలన జనులందు భావపరివర్తనగలిగి కొందరు మొదలగువారితో శాంతిపూజను గావించిరి

### గణపతి యూరేగింపు

కాంగ్రెసుమండలివారిచే గణపతి యూరేగింపుకొరకు కమిటీనొసగుటకై పంపుకొనబడిన విజ్ఞాపనకు "విజ్ఞాపకులు యుక్తవయస్కులు కారుకావున అనుజ్ఞనొసగుటకు వీలులేదు" అని తహశీల్దారుగారు ఆజ్ఞనొసగిరి

## పఠనాలయస్థాపన

("గోలకొండ" విలేఖరి)

ఖిలేషాపురము అబాను ౨౦

దసరాసందర్భమున ఇచట పత్రికాపఠనాలయము స్థాపించబడినది స్థానికవర్తకప్రముఖులగు అనిశెట్టి నారాయణ, య. సిద్ధయ్య, కలకుంట్లరామయ్య, నారాయణ, నరసయ్య నారాయణగారలు అతియుసభ్యులుగాచేరి అలయాభివృద్ధికి తోడ్పడుచున్నారు.

### పాఠశాలస్థాపన

ఆనాడే ఆయుర్వేదపాఠశాల యొకటి స్థాపించబడినది. ౧౦ గురు విద్యార్థులు సదరు తెనుగుభాషా బోధనాప్రణాళిక ననుసరించి ఆయుర్వేదవిద్య నభ్యసించియున్నారు.

హిందీశాఖనాలలో ఈసంవత్సరము జనవరిలో "జరుగు ప్రాథమిక" పరీక్షలకుగాను సుమారు ౨౦ గురువిద్యార్థులు శిక్షనొందుచున్నారు.

## పరస్పరస్పర్థల దుష్ఫలితము

హరిజనోద్యమమున కపాయమేర్పడుట!

(ఒక విలేఖరి)

ఆదూరు అబాను ౨౦

ఇది షర్ఫ్ సలార్జంగు బహద్దరు జిల్లాకేంద్రస్థానమగు కొప్పల్‌కు సమీపమందుగలదు ఈప్రాంతమందలి హరిజనులలో విద్యాప్రచారమొనర్చి వారియందలి మూఢాచారములనిర్మూలించుటకై గ్రామమున హరిజనపాఠశాలయొకటి స్థాపింపబడి కొంతకాలమునుండి హరిజనులలో చక్కనిప్రబోధము కలిగించుచున్నది ప్రస్తుతము పాఠశాలయందు ౨౦ మంది బాలబాలికలు విద్యాభ్యాస మొనరించుచున్నారు

### చెన్నప్పగారు

ఈ పాఠశాలయందలి యొక ఉపాధ్యాయుడు గ్రామాంతర మేగుటవలన వీరశైవలింగాయతు శాఖకుచేరిన శ్రీ చెన్నప్పగారు ఉచితముగా నుత్సాహముతో అధ్యాపకత్వమువహించి పాఠశాలయందు పనిచేయుచున్నారు కుకనూరు గ్రామవిద్యానంద గురుకులాధ్యాపకులగు శ్రీ అర్ జి. పట్వారీ బి ఎ గారిపాఠశాలగాంచి విద్యాస్థితిచక్కగా గలదనియూ, శ్రీచెన్నప్పగారిసేవ అద్వితీయమనియు, వీరినిరంతర కృషివలన బాలురలందేర్పడిన శుచిత్వమునవర్ణబాలురలతో సమముగాగలదని శ్లాఘించిన సదభిప్రాయము గ్రామమందలి యొకవర్గమున కుంటకముగా తేలినది ఆరంభమునుండీ యుద్యమమునకు ప్రతికూలురులుగానున్న వర్గమువారు సమయమేతెంచినదని మరిసి చెన్నప్ప బోధించు పాఠశాలకు బాలురల బంధువారిని మిగతవారు బహిష్కరించ వలయుననియూ, చెన్నప్పను, వారునడుపుచున్న యుద్యమమును నిరసింపవలయుననియు, వారికి నీటిసౌకర్యములు కలిగించ వలదనియు చుట్టుపట్టు గ్రామములందువీరు తీవ్రముగా ప్రతికూలప్రచారము సలుపుచున్నారు దీనివలన పరిస్థితులలో మార్పుకలిగినది కొంతవరకు కిష్టస్థితియేర్పడినది వివరములన్నియూ హైదరాబాదు హరిజనసేవకసంఘమునకు, కర్ణాటక హరిజన సేవకసంఘమునకు దెలుపుచు గ్రామమువేం దలబడికలుగకుండుటకు పరస్పర్థలు యేర్పడకుండుటకు ప్రయత్నించుటకై విశదపరచినటుల తెలియుచున్నది.





# ఆంధ్రమహాసభాధ్యక్షుని పర్యటనము

## కొడకండ్ల, పడునూతుల ప్రజల స్వాగతము

(ఒక విలేఖరి)

జనగామ అబాను ౧౭

ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు పరిజన సహితముగా (శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు, రావి నారాయణరెడ్డిగారలు) అబాను ౧౫వ తేది సాయంత్రము ౬ గంటలకు కొడకండ్ల చేరిరి.

గ్రామస్థులు మంగళవాద్యములతో ఊరి బయటికివచ్చి, శ్రీయుత వేంకటరంగారెడ్డిగారు మున్నగువారందరిని గ్రామములోనికి తీసికొని వెళ్లిరి గ్రామరైతు ముఖ్యులగు శ్రీయుతులు రామప్పారెడ్డి, వరదారెడ్డిగారలు చాల శ్రద్ధాభక్తులతో అతిథులను మొదటి రెండు మూడు మాసముల క్రింద స్థాపింపబడియుండిన శ్రీ రామకృష్ణగ్రంథాలయమునకు తీసికొని వెళ్లిరి ఈసంస్థ దాదాపు ౩౦ మంది పాఠకులను ప్రతిదినము ఆకర్షించుచున్నవి ఆంధ్ర జనపత్రిక, కృష్ణాపత్రిక, గోలకొండ, ప్రజామిత్ర, అభినవ సరస్వతి, గృహలక్ష్మి మున్నగుపత్రికలు వచ్చుచున్నది సుమారు ౩౦౦ పుస్తకములు గలవు ఇది యొక చిన్నయింటియందు నెలకొల్పబడియున్నది పైన పేర్కొనబడిన రెడ్డిసోదర ప్రముఖుల యౌదార్యముతో ఈసంస్థ నడుపబడుచున్నది ఇది చాలప్రశంసనగు విషయము

### స్వాగతము

అచ్చటినుండి అతిథులందరు నూరుప్రజలతో సహా శ్రీ రామప్పారెడ్డిగారి భవనమునకు వచ్చిరి సుమారు ౩౦౦ ప్రజలు అచ్చట పీఠములపైనను జంపఖానాలపైనను సుఖాసీనులైరి. శ్రీ రామప్పారెడ్డిగారు అధ్యక్షమహాశయుల యొక్కయు తదితరాంధ్రమహాశయుల యొక్కయు రాకకు సంతోషము దెలుపుచు వారిని ప్రశంసించిన స్వాగతవ్యాసమును చదివిరి

గ్రామస్థులయొక్కయు గ్రామ ప్రముఖులయొక్కయు యాదరమును ఔదార్యమును భ్రాతృభావమును ప్రశంసించుచు శ్రీయుతకొండా వెంకటరంగారెడ్డిగారును, మా. హనుమంతరావు, నారాయణరెడ్డి, విద్యాసాగరు శంకరరెడ్డిగార్లును ప్రసంగములు సలిపిరి, శ్రీయుత బాలకృష్ణయ్యగారు (స్థానికమహాశయుల) కృతజ్ఞతావందనము లర్పించిరి

తరువాత సభముగిసెను ఈసమావేశమునకు చుట్టుపట్టుల విద్యావంతులును రైతు ప్రముఖులును నగు పలువురు యువకులు ఉత్సాహపూరితులై వచ్చియుండిరి వారందరితోడి కలయిక సంతోషప్రదముగనుండి, దేశాభిమాన భావముల తరంగింపజేయుచుండెను

ఉదారుడగు గృహమేధియింట ఆరాత్రి విందు జరిగినతర్వాత రాత్రి ౯ గంటలనుండి పండరిభజన జరిగినది వీరు తిరుమలగిరియను గ్రామమునుండి వచ్చిన భజనమండలి వారు హార్మోనియము మృదంగాది వాద్యములతో మేళవించి భజనికులు సుశ్రావ్యముగా పాడిన గీతములు శ్రోతల నానందవార్ధిలో ముంచెను వారి యూనిఫారములు, వారి యభినయసహితములగు నాట్యములు అచ్చటినుండి వినువారిని కదలనీక రాత్రి ౧౨ గంటలవరకాపెను తరువాత ఈభజన సమాప్తమైనది

మరునాటిఉదయమున అతిథులందరు స్నానాదులొనర్చినతరువాత అల్పాహారముల గొని కచ్చడపుబండ్లలో బయలుదేరిరి

ఈసందర్భమున కొడకండ్ల గ్రామమునుగురించిన కొన్ని సంగతులు వ్రాయుట ఉచితము ఇది పెద్దగ్రామము గృహసంఖ్య ౪౪౪ జనసంఖ్య ౨౨౦౦ లంబాడియిండ్లు ౩౦ వైశ్యుల యిండ్లు ౧౫ మాదిగవారియిండ్లు సుమారు ౪౦ వీరు దాదాపుగా వందకు ౬ మాసముల క్రింద తురకమత మవలంబించిరట వీరికిని మతదీక్ష యొసగినవారు జాజిరెడ్డిగూడెము హాలావాదేనని తెలిసినది

ఇచ్చట తహతానియా (ప్రైమరి) పాఠశాల సర్కారిది కలదు ఉపాధ్యాయులిద్దరు ఇద్దరును మహమ్మదీయులుండినందున తెనుగు చెప్పుటకు వీల్పాటులు కావలెనని జనులు పట్టుబట్టి పిల్లలను మానుకొనిరి మీదట వీరిలో నొకరినిమార్చి ఒక తెనుగుఉపాధ్యాయు నంపిరట బాలరసంఖ్య ౧౧౦ ఇదియేగాక వరదారెడ్డిగారి ఖాన్గీ ఒకటియొకటి యున్నది. దీనిలో ౧౦ మంది చదివెదరు

తురకపిల్లలకై యొక బాలికాపాఠశాల కలదు హిందూబాలికలకొరకు లేదు ఇట్టిదొకటి ముఖ్యావసరము. విద్యాశాఖాధికారుల దృష్టి నీవిషయమాకర్షించదగినది.

కొడకండ్లనుండి వెడలి రామవరముపోయి ఆంధ్రమహాసభాధ్యక్షులను, వారి పరిజనమును కొడకండ్లలోని రెడ్డిప్రముఖులును, మార్గమధ్యమున,

### పడునూతుల

లో బండ్లుదిగి చావడివద్దనిలుచువరకు గ్రామములోని రైతులు, పనివారలు, (గొల్ల, గౌండ్ల చాకలి మొదలగువారు) వైశ్యులు గుంపులు గుంపులుగా కూడి అధ్యక్షమహాశయుని పరిజనముసహా ఒకగృహమున వాసీనుల జేసిరి. రైతులయిబ్బందులు, పనివారల వెట్టిచాకిరి కష్టములు, కోమట్లకు దారాదెయు అధికారు లవలన కలుగుచున్న ద్రవ్యనష్టములు చెప్పుకొనిరి వారికి అధ్యక్షమహాశయులును ఇతరులును సమాధానముచెప్పి( దయామయులగు మన ప్రభుత్వమువారు అన్నిపనివారలకు న్యాయము చేయుచున్నారని వివరముగా బోధించి వర్తకులకేమనుకై! సిద్ధముచేయబడిన "వర్తకస్వాతంత్రము" యొక్కయు వెట్టిపనివారలకై వ్రాయబడిన తెలుగు లఘుపుస్తకము "వెట్టిచాకిరి" అనుదానియొక్కయు (ఇది మన ఘన నిజాంప్రభువుగారు అనుగ్రహించి జారీచేయించిన ఫర్మానుకు తెలుగుతర్జుమా) అచ్చుప్రతులను జనులకు యియ్యబడెను,

### వైశ్యులనష్టము

ఈసందర్భమున కోమట్లు చెప్పిన ఒక విచారకరమగు కథను వ్రాయుట అవసరమనిపించినది ౧౩౪౬ ఫ ఖుర్దాదు నెలలో నల్లగొండ జిల్లా ఆబ్కారీ మొహతెమింగారి గ్రామమునకు దౌరావచ్చెదమని శేఖలో తమ ముగ్గురు చప్రాసీలను ఇచ్చటికి ముందుగా పంపిరట వారిచ్చటికివచ్చి ముకాముచేసి, తమ అధికారిగారు "ఇదిగోవత్తురు, ఇదిగోవత్తురు" అని వీరి



హిందూజాగిరుదరుగాక, తురకలగుమరుగాక) కష్టములు కలుగకుండ చేయవలయునని నిర్ణయించియున్నారని అధ్యక్షమహాశయులు హరిజనులకు బోధించిరి, జాజిరెడ్డిగూడెము హాలావాగారే ఇచ్చటివారిని తురకల చేసిరి

ఇచ్చట ఒక ఇమాదిపాఠశాల కలదు ౧౦ రూపాయలు ఇమ్దాదుఉన్నది బాలబాలికల సంఖ్య ౨౦ సాతానిపంతులు ఉపాధ్యాయుడు కొత్తతురకలకు మహమ్మదులబ్బాసు అను పంతులు అంజామునతరపున ఉర్దూ జీతము పైని అరబ్బీచెప్పుచున్నారు

భూములపన్నులు తరిపి తక్కినగ్రామములవలెనేఉన్నవి త్రాగువారిసంఖ్య తగ్గినది అబ్కారివారి అదాయము, కల్లుధర రెండింత లైనది. చాకలివాండ్లకు సర్కారీఉద్యోగుల వెట్టి చాలఉన్నదట, వైశ్యులసంగతి పైన రానేవచ్చునది

ఈగ్రామమునుండి బయలుదేరి సుమారు ౧ గంట వేళవరకు అధ్యక్షమహాశయులు మరల రామవరము చేరిరి. అక్కడనే భోజనములు చేసిరి సాయంత్రము మూడుగంటలవేళ మోటారుబండిపైన వెడలి ఆలేరు ప్రవేశించిరి

ఆలేరులో శ్రీయుత అక్కినేపల్లి జానకి రామరావు జాగీర్దారు (హైకోర్టువకీలు) గారి కుమిల్లు మేనేజరులగు శ్రీయుత పెద్దిరాజు వెంకటరావుగారి మేనల్లుడుగారును అధ్యక్షమహాశయునకును పరిజనమునకుస్వాగతమొసగి అల్పాహారములతో సన్మానించిరి తరువాత కొంతసేపటికచ్చటినుండి వారందరును బయలుదేరి ౩ మైళ్లదూరముననున్న కొలనుపాకకు బోయిరి

...షించుచు ఆట్లేయుండిరట! వీరికి తిండికొరకేమిరాక ఊరికోమటికి — వంతుకోమటికి, ఏలయనగా ఇక్కడ వంతుపద్ధతి యింకను పోలేదట — భోజనసామగ్రుల యిప్పించమని చీటీలు పరిదినముగ్రాసి తెప్పించుకొనుటయు పైకము బాకీపెట్టుటయు జరిగెను తుదకు కోమట్లు వివికి తుద్దెరయియ్యమనిరి అప్పటికే రు ౧౧౦ బాకీపడినవి! తరువాత కొన్నిదినముల వరకు అబ్కారి మొహతెమింగారి వసమ్మలు దబ్బుపెట్టి ధాన్యములను కొని నిరీక్షించుచు గడపిరట! తుదకు అధికారి రాడని సమాచారమంపగా వారు స్వస్థానములకువెళ్లిరి కోమట్లకు రు ౧౧౦ బాకీమిగిలినది! వారు ధైర్యముచేసి ఆగ్రామములోనుండు అబ్కారీవారితోగా నడుగగా వారు రు ౧౧౦ లు తానేయిస్తానని వాగ్దానములు చేయుచు గడపెనట! తుదకు ఇయ్యలేదని చెప్పి చీటీలు ఆంధ్రమహాసభాధ్యక్షునకు చూపి అధికారులకువ్రాసి పైకమిప్పించవలసినదిగా ప్రార్థించిరి! అంతే,

ఈగ్రామపుజనసంఖ్య ౧౬౨౩ ఇచ్చట తురకలయిండ్లు పూర్వపువి ౧౫ ఉండెను హరిజనులు ౪౦ యిండ్లవాండ్లు కొత్తగా తురకలైనారు వీరు గూడెములోనే యున్నారు గ్రామపుతురకలు వారితోకలిసి భుజించుటయింకను లేదట కొత్తవారు ఎప్పటివలె వీదతనమునందే యున్నారు. వెట్టి వెతుకటివలెనే చేయుచున్నారు ఆశపడినట్లుగా వారికి సారంబోకుభూములు, స్థలములు, ఇనాములు యింకను దొరకలేదనుకొనుచున్నారు ఇంకను తమపేర్లు "ముత్తడు" మొదలగునవి అనగా హిందూపేర్లే చెప్పుకొనుచున్నారు వెట్టిచాకిరివిషయములో మనప్రభువుగారి ఫర్మాను తెలుగు తర్జుమాప్రతులు వారికిచ్చి, దయామయులగు మనప్రభుత్వమువారు ఎవరికైనను సరే (వారు

# యుద్ధార వు - ఈ వేళ రేవు

## మరొక మహాసంగ్రామ సూచన

### బాల్కన్ అధిపత్యములు

చెకోస్లొవాక్యా, సోవియేటురష్యాతో సైనిక స్నేహము కలిగించుకొని ఫ్రాంసు శక్తివంతమైనది. ఈ రెండాధిపత్యములకు పరస్పర సైనిక మిత్రత్వముగలదు. అంతర్జాతీ యావసర సమయమునందీ మూడు అధిపత్యములు స్నేహపూరితముగా ప్రవర్తించునని నిశ్చయము. అల్పాధిపత్యములగు జెకోస్లొవాక్యా, రుమేన్యాతో చెకోస్లోవాక్యాకు రహస్య సంబంధము గలదు. బాల్కన్ అధిపత్యములద్వారా జుగోస్లావ్యా, రుమేన్యాకు గ్రీసు; టర్కీతో చక్కని సంబంధ మేర్పడినది. జుగోస్లావ్యా, రుమేన్యల నిస్సారపరచి జర్మనిమధ్య యూరపునందు చెకోస్లావ్యాను అంతమొందించగలనని తలంచుచున్నది. రుమేన్యా, పోలెండు ద్వారా రష్యాసహాయము చెకోస్లోవాక్యాకు చేరగలుగుటయే యీ ఆశయ కారణమనవచ్చును. పోలెండు జర్మనిమధ్య అప్రతిహతమైన ఒడిక జరుగుటవలన యీ పోలెండు సమస్య జర్మనికి బాధకరముగా నుండజాలదు. ఇటలీని కారణభూతముగా నొనర్చి జర్మని ఆస్ట్రియాను తన అధీనమునందు లాగుకొనుటకు ప్రయత్నించుచున్నది. బ్రిటనుద్వారా జర్మని మాయోపాయము లల్లుచు సైనిక దృష్టికి సోవియేటు రష్యా గణనీయముగా నుండజాలదని ఫ్రాంసుకు విశ్వాసము కలిగించుటకు ప్రయత్నించుచు ఫ్రాంకో సోవియేటు యొడంబడికను అతిక్రమించి ప్రవర్తించుటకు ఫ్రాంసును ప్రేరేపించుచున్నవి. ఇటీవల రష్యాయందు జరిగిన సైనికాధికారుల (౮ రు) మరణ శిక్షలవలన ధన సాంప్రదాయాధిపత్యములకు చేయూత కలుగుటచే "సోవియేటుసైన్యమునందు అవిధేయత ప్రబలినదనియు, సమరసమయమునందు విశ్వసించుటకు పూర్తిగా వీలులేదని"యు తీవ్రముగా ప్రచారము సలుపబడుచున్నది. జర్మని స్పెయినందు పట్టుదల కలిగించుకొనుటకు ప్రయత్నించుచున్నది. ఒకవేళ ఫ్రాంసుతో యుద్ధమే సంభవించిన ఫ్రాంసు వెనుకనుండి ముట్టడించుట కీయుత్తు యొత్తబడినది. యూరపునందు యుద్ధమేర్పడునప్పుడు ఫ్రాంసు యొత్తరాత్రికొనుండి సైన్యము, ఆహారము సముద్రమార్గ సౌకర్యములు, పదములనేర్చివేయుటకు సంకల్పింపబడినది. ఫ్రాంసును నలువైపులనుండి అసహాయతగా నిర్బలపరచియు, బ్రిటిషు విదేశకార్యాలయమునం దొకడికలిగించి యొటులైనను "పాశ్చాత్య యొడంబడిక" పై సంతకముచేయించి ప్రాక్మధ్య యూరపునందు సంపూర్ణస్వాతంత్ర్యమనుభవించగలనని జర్మని తలంచుచున్నది. ఫ్రాంసు యీయొత్తుల నంగీకరించక సోవియేటు రష్యాతోచేరి జర్మనితో పోరాడిన ౧౯౧౪ సం॥ నాటికన్న తనస్థితి అతి దుర్బలముగాగలదని ఫ్రాంసు తప్పక గ్రహించి తీరును.

### ఫ్రాంసు

కాని ఫ్రాంసు జర్మని యొత్తులకు లొంగునా? అసంభవమనుట నిశ్చయము. ఖండముపై యొకరి—ఫ్రాంసు, జర్మని—అధిపత్యము, చలామణి యున్నదనువిషయము బ్రిటనుకు అసంగతము. బ్రిటను అభిమతములన్నియు యూరపున కావలనే కేంద్రీకరమై యుండుటయే దీనికి ప్రబలకారణము. బ్రిటన్ మాదిరిగాక ఫ్రాంసు ఖండాధిపత్యము వలసాధిపత్యములు కలిగియుండుటవలన ఫ్రాంసు తన జాతీయత్వము ననుకొనినంత సులభముగా త్యజించలేదు. ఇంతేగాక ఫ్రాంసు కేవలము తనఖండముల నాధిపత్య నిర్వహణములకే ప్రయత్నించుటగాక తన జాతీయతా రక్షణముకై కంకణము ధరించియున్నది. జర్మనివలన ౧౮౭౦ లో అనుభవించిన పరాభవము ఫ్రాంసు జ్ఞప్తియందు తాండవించుచున్నది. జర్మనీ జనాభాలో ఫ్రాంసుది ౨/౩ మే స్థాయిత్వము కలిగినను జర్మని జనాభా నానాటికి వృద్ధిగాంచుచున్నది. అందువలన ఫ్రాంసుకు జర్మనిభయ మమితముగా గలదు. జర్మని, ఆంగ్లోజర్మని నావికయొడంబడికననుసరించి తన నావిక శక్తిని నిర్ణీత అవరణమునందు కాపాడుకొనుచుండు నంతవరకు బ్రిటన్‌కు యిట్టిభయ మేమియు కలుగ వీలులేదు. ఈ కారణములవలన ఫ్రాంసుకును జర్మనీ ఆదర్శముల, అభిమతముల, కోరికలపై విపరీత అనుమానము గలదు. "మాయీన్ క్యాంఫ్" గ్రంథమునందు హిట్లరు ఫ్రాంసు విషయమై వెడలగక్కిన విషము యీ అనుమానమును మరింత బలపరచుచున్నది. ఫ్రాంసునందు సహాయులకుజర్మనిపై, అతివాదులకు హిట్లరుగురించి అసహ్యపడుట గలదని యొకరచయిత క్లుప్తముగా వచించిన సైనూత్రములు గమనార్హములు. జర్మనియందతివాద జాతీయవాదులకు నాజీ పక్షమువారు అధికారము వహించి యుండునంత కాలము ఫ్రాంసు ప్రాక్ మధ్య యూరపునందు తన మిత్రమండలిని, సహాయవర్గములను కోలుపోవునా అను విషయ మీ పరిస్థితులలో సందేహాస్పదము.

### సుభాషు చంద్రబోసు

ధృశ్యము ప్రతి క్షణము మారుచున్నది. రాజకీయ జోశ్యములు గహనములు. ఒకవిషయము మాత్రము నిశ్చయము. ఒకవేళ యుద్ధమే యేర్పడిన తత్ఫలితముగా పూర్వ, మధ్య యూరపు "ప్రస్తుత పరిస్థితులు" జర్మని సవాలు — యుద్ధము జరుగునా?— కు జవాబు ముఖ్యముగా బ్రిటనుపై ఆధారపడ గలదు. జర్మని తిరిగి ౧౯౧౪ నాటి పొరపాట్లు చేయజాలదు. యుద్ధమునందు దుంకదు. బ్రిటిస్ తనకు ప్రతికూలము గాగలదని గ్రహించిన, బ్రిటన్ యుద్ధమునందు చేరదని దెలిసిన రంగ మెక్కవచ్చును; ౧౯౧౪లో జరిగినటుల మధ్య పూర్వ యూరపు అలజడిలో బ్రిటన్ ఫ్రాంసు తాటస్థ్య పద్ధతిపై నేకీ భవించినను, జర్మనీ సన్నాహము, పై తూర్పునందుదయ మగునటుల యూరపునందు యుద్ధ మారంభమగుట నిశ్చయము. ఫ్రాంసు సోవియేటు రిష్యా చేరిన, బ్రిటన్ తటస్థముగా నుండు వరుస కేర్పడు యుద్ధఫలితములు సంశయాస్పదములు.

నేడు స్పెయిన్, బల్గేరియా రెండు దృశ్యములు చూడవలసియున్నవి, జనరల్ ఫ్రాంకో విజయము బడసిన యిటలీ జర్మనీ జయము; అనగా మధ్య ధరా సముద్రమునందు బ్రిటన్ అధిపత్య మంతమగును. ఖండమునందు యుద్ధ మారంభమైన ఫ్రాంసుకు పాడు కాలమే!

బల్గేరియాయందు జర్మని జకోస్లావియా, రుమేనియాలను చెకోస్లో వాక్యాలో విడదీసుటయందు జయముగాంచిన యుద్ధరూపమున ౭౭ గంటలకాలములో ప్రేగును ఆక్రమించుకొనుట నిశ్చయము. కొంతకాలములో చెకోస్లావాక్యాను కబళించివేయును. కాని గహన సమస్య— రష్యా—అటులే నిలిచియుండును. రష్యావా రతిచాక చక్యులు: నిపుణులు. యూరపు విజేయత యగు నెపోలియన్‌ను హడలించివేసిరి. హిట్లరును హడలించి వేయుదురా.

### స్పేన్

స్పెయిన్ గృహకల్లోల మింకను త్రాగునందుండుటచే జర్మనీ మాయోపాయములు—డిప్లొమసీ — యెంతవరకు జయమొందగలిగె ననునది నిశ్చయించ వీలులేదు. కాని మధ్యప్రాక్ యూరపునందు గడించినఅభివృద్ధి అపారము. రుమేన్యాయందు రాజు, పాలకవర్గ మంత్రులు పూర్తిగా జర్మనీపక్షమువారే; పూర్వపు విదేశాంగమంత్రియగు టిటులెస్కో, ఫ్రాంసు అనుయాయి, పలుకుబడి నశించినది. రుమేన్యాయందు ప్రతికూలపక్షము నాజీ అనుయాయులు, "ఇనుపరక్షక గార్డు" నాయకుడు కోడ్రియాను.

ఈతడు ప్రభుత్వమునకు కుడిభుజము. జుగోస్లావియాయందలి ప్రధానామాత్యుడగు స్టొయాడి యానోవ్. అతనిప్రభుత్వము నాజీ అనుకూలురులు, రాజ కుటుంబము బ్రిటిషు ప్రభావోపేతము. గ్రీసు ప్రధానామాత్యుడగు మెటక్సాస్ యిటీవలనే నియంతగా నిర్ణయించుకొనినవాడు; జర్మనిచేతి కీలుబొమ్మ యనుట నిర్వివాదాంశము. బ్లాకుసీయందలి రష్యాయోడలు దార్డనల్సునుండి మధ్యధరాసముద్రమునం దుప్రవేశించిన గ్రీసుదీవులని వానిని ముట్టడించుటకు చక్కని వీలుండుటచే గ్రీసు జర్మనికి చాలా ముఖ్యము: దీనివలన "కోల్పోయిన" అధిపత్యములకు హంగరి, బల్గేరియా వీనియందు వాని జాతీయకోరికల నిర్వర్తించుటకు అనుకూలములు కలిగించిన జర్మనితో నేకమగుట నిశ్చయము. వీనివలన జర్మని బాల్కన్ పెనిన్ సులాయందు ఫ్రాంసుకన్న పలుకుబడి యెక్కువ సంపాదించుకొనియుండుట వలన విపరీతమగు వ్యాపారాలు కలిగించుచున్నది.

కాని అంతర్జాతీయ రాజకీయములందే పరిష్కారము లేదు. జర్మనికి ఫ్రాంసు ఛాయగా మెలగుచుండుటచే గ్రీసునందలి మెటక్సాస్, జుగోస్లావియాయందలి స్టొడియానావ్ ప్రభుత్వము లెంతకాలముంక నాగునది యిప్పుడే నిర్ణయించలేదు. రుమేన్యాయందు నాజీ అనుకూలపక్షమువా రాధిపత్యమువహించి యుంచుకుండినను విశ్వసింప వీలులేదు. బాల్కన్ వారి తారుమారు ప్రవృత్తి సామెతగా కలదు. వర్తమాన యూరపురాజకీయ డిప్లమట్ గౌరవము గడించిన చెకోస్లావాక్యాధ్యక్షులగు ఎడ్వర్డు బెన్సిస్ తనకు విరోధిగా జర్మని భావించుచున్నది:

మో
హి
ని
క

చీకులేదు చింతలేదు
ఒకటే ఆనందము
నవయౌవన విలాసము!
మీకేల యీకోరిక?

ఆమెకు
పూర్ణారోగ్యము!
మీకు అది కొరవడినది

ఆరోగ్యముండిన స్త్రీకి అంతయు ఆనందమే!! గృహాయాజమాన్యము, సంతానసంపద, పెద్దరికము అన్నియు ఆరోగ్యముండిన అమరగలవు.

ఆరోగ్యము - స్త్రీలఆరోగ్యము ముఖ్యముగ గర్భకోశముయొక్క స్థితిపై నాధారపడియున్నది. గర్భమందు యుట్టి దోషములను లేకయుండిన స్త్రీకి ఆ యానందము, ఆ సౌందర్యము, ఆ నవయౌవన విలాసము, సంతానకోర్కె అన్నియు అమరగలవు.

అనారోగ్య దేహములు పూవని అసలు విడచువారెవరో. అది అనవసరము. మీ ఆనందము మీ అందుబాటులో నున్నది.

లోధ్ర
ఆరోగ్యప్రదాయిని
కేసరి కుటీరం—మద్రాసు

ఏజంట్లు, సీతారాం జనల్ స్టోర్సు
—బెజవాడ

దేవునివద్దనుండి వరముగా దిగబడిన

## రెండు రత్నములు
## నపుంసత్వఖర్జూరము
## అమృత తిల

నపుంసకత్వముచే ప్రాణహత్యకు పూనిన అనేకులు యీకాయలవల్ల పునర్జన్మము పొంది ఇద్దరు ముగ్గురు స్త్రీలతో సుఖము అనుభవించుచున్నారు. ఖర్జూరపుకాయలవల్ల ఇంద్రియ పటుత్వమున్ను, వీర్య స్తంభనమున్ను కలిగి అమృతతిలావల్ల లింగము నరములకు శక్తిన్ని సరచలింగమును పెంచును. ౨౦ యేండ్ల బాలునివలె యువ్వనశక్తి యేర్పడును. వీర్య స్తంభనమువల్ల స్త్రీ లకు తన పురుషునిమీద ప్రేమకలిగించును. మోసముకాదు, ఒకసారి వాడిచూడుము. ౨౨ కాయలు, ౧౧ దినములకు అమృతతిలా సహా. రు ౫—౦—౦ పోష్టుఖర్చులు వేరు.

# భారతదేశమునుపాలించుచున్నది యింకను బ్రిటిషుప్రభుత్వమే!

## దేశములో స్వరాజ్యము, కాంగ్రెసురాజ్యమనునదిలేదు

కలకత్తా: అక్టోబరు ౨౯

"కాంగ్రెసు బలమునుగురించి దంబములు పలుకుటయేగాని యింతవరకు జేలుగదులలో బ్రతుకుచున్న మనసోదరులను విడుదలచేయించజాలకుండుట మనదౌర్బల్యము విశదమగుటలేదా? దేశమును పాలించునది కాంగ్రెసుమంత్రివర్గమో అమంత్రివర్గమో కాదు, అది బ్రిటిషుప్రభుత్వమే యనువిషయము మరువవీలులేదు; ఇంకను దేశమునందు బ్రిటిషు మనోభిలాషయే ప్రబలియున్నది. దేశమునందు కాంగ్రెసురాజ్యముగాని, స్వరాజ్యముగాని యేమాత్రము లేదనుట నిశ్చయము"ని నేను సాయంకాలము బహిరంగ సభయందు పన్యసించుచు నె హ్రూగారు నుడివిరి. ఇది శ్రద్ధానంద పార్కునందు శ్రీసుభాషు చంద్రబోసుగారి యధ్యక్షతక్రింద రాజకీయఖైదీలను డిటన్యూలవిడుదలకై యావద్భారత సంచలన మారంభించుట కుద్దేశింపబడియుండెను.

దేశాభిలాషను నెరవేర్చుటకు అవగా రాజకీయఖైదీలను విడుదలచేయుటకై కాంగ్రెసుకు సంపూర్ణశక్తిసంపదలు వీరపడినచే జరుగగలదనియు, జవాహరులాలు గురించి వివరించుచు కాంగ్రెసునందు మహమ్మదీయులసంఖ్య ముస్లింలీగునందుకన్న అధికముగాగలదనుట నిశ్చయమని సర్దారు పటేలు సెలవిచ్చిరి.

నేడు దేశమందలి ౭ కోట్ల మహమ్మదీయులు వెనకగొట్టబడుదురనిగాదు ప్రజలకలవరపరచుచున్నది. జనసామాన్యము, బీద, దరిద్రుల, శ్రీమంతుల, ధనికులమధ్యక్కలిగిన ముఖ్య సమస్యయే ఆలోచనీయాంశమని గఫ్ఫార్ ఖాన్ గారు విశదపరచిరి.

"నేడు బెంగాలునందేర్పడిన అరిష్టదాయక పరిస్థితులనుగూర్చి దేశమంతయు నాలోచించుచున్నద"ని నెహ్రూగారు నుడివిరి.

"రాజకీయనిర్బంధితులకు భారతదేశమే అండమానుదీవులుగా నున్నస్థితిలో వారిని స్వదేశమునకు రప్పించినంతమాత్రమున వారికి సాయమొనర్చుట కాజాలద"ని సరోజనినాయుడుగారు పలికిరి.

## కావలెను

నెలజీతముల మీదగాని, కమిషన్ పద్ధతినిగాని, ఒక పురాతన భారతీయ భీమాకంపెనీ కొరకు చీఫ్ ఆర్గనైజర్లు, జిల్లాఆర్గనైజర్లు కావలయును,—వలయువారు పోస్టుద్వారాగాని,స్వయముగా గాని, ఈక్రిందివారిని సంప్రదించుడు.

సబాఅండుకో,
చాపెల్ రోడ్డు
హైద్రాబాద్ దక్కన్

## మద్యపాన నిషేదము

హైద్రాబాద కాంగ్రెసు సంఘాధ్యక్షులు గత సోమవారంనాడు జన మ. ని. కేంద్ర సంఘాధ్యక్షులగు నవాబు మిర్జాయార్జంగు బహద్దురు గారితో రాష్ట్రమునందు మద్యపాననిషేధాద్యమారంభించు విషయములో ముచ్చటించిరి.

## మద్యపాన నిషేద కేంద్ర సంఘము

రాజాబహద్దురు రాయ విశ్వేశ్వరనాథ నవాబు యాసర్‌జంగు బహదురుగార్లపై సం. ఘ సభ్యత్వ మంగీకరించిరి.



## మ. ఘ. వ. నైజాంస్టేటు రైల్వే

### పండరిపుర క్షేత్రములో

## కార్తీకఏకాదశి పర్వదినము
### నవంబరు 1937.

రైలుబస్సు చార్జీలతో కలసిన రిటర్న్ టిక్కెట్లు నవంబరు 7 నుండి 14నవంబరు 1937 వరకు (రెండురోజులు కలుపుకొని) నైజాం స్టేటురైల్వేలో కొన్నిస్టేషన్లనుండి, పండరిపురమునకు, లాతూరురోడ్డు (యన్. యస్.) లాతూర్ (బి.యల్.) రైల్వే స్టేషన్లద్వారా యివ్వబడును. యీటిక్కెట్లు తిరుగుప్రయాణము 23 నవంబరు, 1937 అర్ధరాత్రివరకు చెల్లును. మూడుసంవత్సరములకు పైబడియు 12 సంవత్సరములకు లోబడిన పిల్లలకు తగ్గింపు రేట్లుతో సగముచార్జి మాత్రమే వసూలు చేయబడును.    యితర వివరములకు

చీఫ్ కమర్షియల్ మేనేజరు
నై. స్టేట్. రైల్వే. సికింద్రాబాదు

## ప్రకటన

### శ్రీకురుమూర్తిస్వామిజాతర

### అమ్మాపురంఇలాకాసంస్థాన్ అమరచింత

### జిల్లా మహబూబునగరము

కార్తీక శుద్ధ (రజబ్ ౧౩౪౬ఫ. సోమవారంనుండి ప్రారంభమయి ౨౮౦ ౧౩౪౬ఫ బుధవారము వరకు కాగలదు. ఈజాతరలో పశువులు. పట్టువి నూలువి బట్టలు కంబళ్ళు మొదలగునవి విశేషముగా క్రయవిక్రయములు జరుగును. ఇందువల ప్రదర్శకులు విక్రయదారులు. వర్తకులు వారముదినములు ముందుగానే వచ్చుచుందురు. పైతారీఖుల తరువాత వారమురోజుల వరకు రాకపోకలు క్రయవిక్రయములు జరుగుచుండును. కురుమూర్తిస్టేషన్ (ద్రోనాచలముకైను) నద్దజాతర రోజులలో మోటరు బండ్లు వగైరా తయారువుండును. స్టేషన్ నుండి జాతర జరుగుస్థలము నాలుగుమైళ్ళదూరమున నుండును—లాటరీలు దగా దోకా ఆటలు పూర్తిగానిషేధము. వ్యతిరేకులపైన జాబితా ప్రకారము కార్యవాయిచేయబడును.

మాణిక్యప్రసాదు
తాలూకాదారుసంస్థాన్
అమరచింత

# విశ్వ విద్యాలయ పట్టముల్లపై మురవకుడు

## భావి పౌరవ భాగ్యము గడించుటకు సంసిద్ధులుగుండు

కె. ఎఫ్. నారీమన్ గారు ఎర్పాంథింపబడుటకు పూర్వము విద్యార్థుల నుద్బోధించుట

(“గోలకొండ” విలేఖరి)

తెంగుహూకు ౨౭ ఆక్టోబరు.

“కార్యసాఫల్యతను, విజయమునను నిర్భయాంతము, సత్యమును పట్టుకలయుదు రెండు గుణము లత్యవసరము”ని భావప్ప పౌర్యకండు మైసూరు విద్యార్థుల సమితిపక్షమున సమావేశ పరుపబడిన బహిరంగసభయం దుపన్యసించుచు నుడివిరి.

“మీరు మీ పరీక్షల విషయమై భావించుటకు పూర్వము, మీ విద్యాభ్యాసము నాలోచించుటకు మొదలు, మీరి మహోత్కృష్టదేశమునకు భావి పౌరులను సత్యము గ్రహించు టత్యవసరము”ని విద్యార్థుల హెచ్చరించిరి.

“వర్తమాన విద్యాపద్ధతులు కేవలము మన బాలబాలికల జీవనాధారములకు ధనమార్జించుటకు, సౌఖ్యముగా జీవితములగడుపుటకు. ముందును ధనముకూడబెట్టుటకు ప్రతికొల్పుచున్నవి. ఇది జీవితోద్దేశము కాజాలదు; సంపూర్ణఆదర్శ మిదియే నను టవివేకము” అని నుడివిరి.

వర్తమాన పరిస్థితులలో యువకుల బాధించుచున్న విషయముల వివరించుచు “విద్యార్థులు పట్టభద్రులై, డిగ్రీలు పొందినవెంటనే జీవితవిషాదమును అనగా నిరుద్యోగమును నెదుర్కొనవలసి వచ్చుచున్నది. కలకత్తా నగరమునందు డబల్ గ్రాడ్యుయేటు లనేకులు నగరరక్షక సైనికపదవికి ప్రయత్నించిన విషయము విషాదకరము”ని విచారము వెలిబుచ్చిరి!

“విద్యార్థులారా! మీ డిగ్రీ విశ్వవిద్యాలయ పట్టముల నంతగా లెక్కించవలదు. జీవితవిషాదమునకు సంసిద్ధులుగానుండుడు. అపజయములు జయమునకు స్తంభములు. కోలారు బంగారు గనులలో కూలివాడు బంగారు తేలువరకు నుత్సాహముతో గనులందు ప్రదేశము త్రవ్వుచుండునట్లుల మీరు నిరుత్సాహులుకాక ఆదర్శ సాఫల్యమునకు నిరంతరము ప్రయత్నించుచుండవలయును. జీవితమంత మంధకారావృతము గాకుండుటకు భావి పౌరవ భాగ్యము బడయుటకు సంసిద్ధులుగండు. ఈ సాఫల్యతను మీరు మనదేశపంకలి వీరాగ్రేసరుడగు లోకమాన్యుని ఆదర్శముగా నిర్ణయించుకొనవ”ని యుద్బోధించెను.

---

## నోటీసు

శ్రీయుత రాంప్రసాద్ వల్లు భారత్ సాకీన్ యిల్లందు బొజారుగారికి.

మీ అన్నయగు జగన్నాథ్ వల్లు భారత్ 22, ఫిట్ యిల్లందుగారి తరఫునుంచి తెలియపరచుట యేమనగ మీరు యిల్లందు బజారులో పెట్టిన హోటల్ యొక్క లాభనష్టములకు సదరు జగన్నాథ్ బాధ్యుడుకాడు. హోటలు గురించి మీరు జరుపబడే ఇచ్చిపుచ్చుకొనుటలు లాభనష్టములు మీయొక్క స్వంతఆస్తివలననే జరుగును. కాని మీఅన్నగారి దుకాణం వ ఆస్తితో యేవిధమయిన సంబంధము ఉండనేరదు. నీవు ఇచ్చి పుచ్చుకొనువారలు జగన్నాథ్ యొక్క ఆస్తిపై యేవిధమయిన హక్కును కలిపించనేరదు. సదరు నోటీసు అభిప్రాయము పత్రికా ముఖమున ప్రకటించబడినది.

ఇట్లు
మౌల్వి సయ్యాదుల్ హమీద్ నకీలకీల్
దర్జ అవ్వల్ యిల్లదు

---

రాజవైద్య H. M. కమాలొద్దీన్
కార్వేటినగరం (చిత్తూరుజిల్లా
సుప్రసిద్ధ లోకామయహార



కస్తూరి మాత్రలు

జలుబు, జ్వరము, దగ్గువగైరాలకు చాల ఉపయోగము.
సీసాంకి రు ౧-౪-౦.
శ్రీసీతారాఘవఔషధాలయం
హైదరాబాదు
ఏజంట్లు:—చునీలాలు బారాయణజీఅత్తరు వ్యాపారులు
హైదరాబాదు దక్కన్

---

# దీపావళి 1937

## మీ మీ కందరకు శుభమగుగాక.

తమరొక పర్యాయము మా కార్ఖానాకుగాని, ప్రదర్శన శాలకుగాని దయచేసి, అక్కడ సిల్కు, నూలు సూటింగులు, షర్టింగులు, షేర్వానీలకు పనికివచ్చు వివిధరంగులలోను, నమూనాలలోను యుండు బట్టలను పరీక్షింపుడు. చీరెలను, బిడ్డల ఫ్రాకుల కొరకును తమ యిష్టమువచ్చినవాటిని దీపావళికొరకు ఏరుకొనుడు. స్వదేశీ పరిశ్రమల నభివృద్ధిపరచే అభిప్రాయము మీయందు బలమగుగాక. తమకును తమ దేశీయ సోదరులకును క్షేమమగుగాక.

భాగ్యనగర్ వీవింగ్ వర్క్సు,
చునిలాల్ గార్డెన్, సుల్తానుబజారు,
హైదరాబాదు-దక్కన్.

---

# మీ భవన నిర్మాణములో

సౌకర్యము, శీఘ్రము, గట్టితనము, కొద్దివ్యయము

కావలయునా?

అయితే ఈరోజునుండే బలవపురాతిసున్నము మాత్రమే ఉపయోగించుము.

## హైదరాబాదు మార్బల్ వర్క్సు

కోచ ఫసీజంగు రిసాలె అబ్దుల్లా హైదరాబాదు-దక్కన్.

---

## మ. మ. వ నైజాంస్టేటురైల్వే

### 1937 నవంబరులో
కీరపండరిపురక్షేత్రము చిలకలపూడి M. S. M. Rly

# కార్తీక ఏకాదసి

మూడవతరగతి ప్రయాణీకులకు తగ్గింపురిటరన్ టిక్కట్లు, 6నుండి 20వ నవంబరు 1937 (రెండురోజుల కలుపుకొని) వరకుయివ్వబడును. యీటిక్కట్లు27 నవంబరు 1937 అర్థరాత్రివరకు మాత్రముతిరుగుప్రయాణము పూర్తి చేసుకొనుటకుపయోగించును. టిక్కట్లు శికింద్రాబాదు మరియు హైద్రాబాదుబి. జి. స్టేషనులనుండిచిలకలపూడి, మరియు మచిలీపట్టణము నకుయివ్వబడును.

### ఛార్జీలు

| | | |
|---|---|---|
| శికింద్రాబాదునండి | బి.జి.రు. | 6-12-0 |
| హైద్రాబాదు ,, | బి.జి.రు. | 6-13-0 |

యితరవివరములకు

చీఫ్‌కమర్షియల్ మ్యానేజర్
యన్. యస్, రైల్వే- శికింద్రాబాదు

---

కలరా భయములేదు కలరా భీతిజెందకుడు

కలరాకు దివ్యౌషధము

## విక్టర్ డ్రాప్సు మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును. రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును అనేకులు మావిక్టర్ డ్రాప్సును ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్ డ్రాప్సు ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును.

సోల్ యెజంట్లు: విక్టర్ అండు కో
పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు)

---

గవర్నమెంటువారిచే రిజిస్టరుచేయుబడిన

## యునాని వైద్య సారము

ఈ గ్రంథమున శిరసాది పాదపర్యంతము కలుగు యావత్తువ్యాధులు వాటి లక్షణములు వాటికి తమచికిత్సలు యింకఅనేకమర్మములు, నాడిపరీక్ష యిత్యాదియు విశదముగా వ్రాసియుండుటచే యేమితెలియనివారును దీనివల్ల కఠినమైనవ్యాధులకు ధైర్యముగా చికిత్స చేయుచు గొప్ప డాక్టర్లనే పేరుపొందదగుటేకాక మంచిలాభము పొందుచున్నారు. ౩౦౦ పేజీలు కాలికోబైండు వెల కాపి ౧ కి రు ౨-౦-౦. పోష్టుఖర్చు ౦-౩-౦

రాజవైద్య H. M. కమాలొద్దీన్
కార్వేటినగరం (చిత్తూరుజిల్లా

---

# పదికోట్ల

## రూపాయిలకు పైగా

హిందుస్థాన్, కోఆపరేటివ్ ఇన్షూరెను కంపెనీలో ప్రజలుభీమాచేసి యున్నారు ఎందుకనగా—

## గొప్పనమ్మకముగల కంపెనీ

లోకల్ ఆఫీసు:— సెంట్రల్ బ్యాంకు బిల్డింగ్సు హైదరాబాదుస్థాని.

---

# రాబందుల ముక్కుపోట్లతో నీరసించుచున్న చైనా

## ౧౫౦ ఏండ్ల చైనా జాతీయ చరిత్ర

### ఇంగ్లీషు రాబందుల తర్వాత ఫ్రెంచి, అమెరికా, జపాను రాబందుల క్రౌర్యములు

గతించిన ౧౫౦ వండ్లనుండియు చైనా చరిత్ర రాబందులు పొడుచుకొని తినుచు లేవనీయకున్న జీవత్కళేబరస్థితికి ఉపమానముగ నున్నది. ౧౭౮౯లో ఆంగ్లేయులు ఆరాజ్యమందు అడుగు పెట్టినది మొదలు నేటివరకును, ఎవడో ఒకడు పరుడు ఆదేశమును లూటీచేయుచు అణగద్రొక్కుచునే యున్నాడు. ఈ దెబ్బలకు తగిన సమాధానము చెప్ప గలశక్తి ౧౯౦౦ సం॥ తర్వాత అంకురించిన చైనా జాతీయతాభావమునకు సరిగా ఏర్పడలేదు. ఇపుడు ఆశక్తి ఏర్పడినదిగాని, దానినిమించిన నవీన మారణ పరికరముల శక్తి సంపత్తి చైనాను పీడించు రాబందులకు చేకూరియున్నది

చైనాచరిత్ర అతి ప్రాచీనమైనది ఆప్రాచీన కాలములో మూడువేల ఏండ్లవరకు చైనా సకల సంపదలతోను తులతూగుచు సుఖముగానుండును. కళలు, విజ్ఞానము, నాగరికత చాల ఉన్నత దశకు అభివృద్ధిగాంచెను.

ఆటివీధిలో "తెల్లవాడు" అక్కడ వ్యాపారమునకేనియు, క్రైస్తవమత ప్రచారమునకేని యు అడుగుపెట్టెను. ఇదేదో ఉపద్రవమునకే వచ్చినదని చైనావారు భయపడి, ఈ "విదేశ క్రైస్తవము"ను పాలిటికిల దాపురించెరా యని గొణగసే గొణగిరి

ఈప్రకారము మొట్టమొదట వచ్చిన తెల్లవారు ఆంగ్లేయులు. క్రీ॥ శ॥ ౧౭౯౩లో ఆంగ్ల ప్రభుత్వ చైనాదేశముతో వ్యాపారము చేసికొనుటకు చియాన్‌లంగ్ సార్వభౌముని అనుమతి ని సంపాదించుటకై కొందరిని రాయబారులనుగ బంపెను. చైనాచక్రవర్తి, అప్పుడు ఆంగ్లేశప్రభువగు మూడవ జార్జిగారి కిట్లు జవాబు వ్రాసెను. "ఈ విశాలభూమికి ప్రభువునైన నాకు అకళంకమైన పరిపాలన సాగునట్లు చేయుటయు, రాజ్యపాలన కవసరములగు విధులను నెరవేర్చుటయు మాత్రమే ఉద్దేశ్యము విచిత్రవస్తువులును, ఎక్కువ ధరగల వస్తువులును నాకుఉపచింపవు మీదేశము తయారుచేయు వస్తువులు నాకు ఉపయోగింపవు. ఈ ఉత్తరమువనె భయభక్తులతో బద్దుడవగుము దీనిని నిర్లక్ష్యము చేయుకుండు జాగ్రత్త!" ఈ సమాధానమునందు చైనీయ నాగరికతకు మించినది లేద నుగర్వమును, క్షణికములగు వినోదవిలాసవిచిత్రవస్తువులయెడ చక్రవర్తికిగల ఏవగింపును చక్కగా విశదమగుచున్నవి.

* * * *

కాని ఆతెల్ల "శనైశ్చరులు" ఆమాత్రముతో నిరాశచెందువారా! కొంతకాలము, తమ కాలము కాదనుకొని వంగియుండిరి ఈలోగా ఆలోచించి ఆలోచించి ఒక యుక్తి చేసిరి రహస్యముగా చైనాలోకి నల్లమందును తీసికొనివచ్చుచు ప్రజలకు అలవాటు చేయసాగిరి ఒకప్పుడు భారతీయ బౌద్ధులు దివ్యజ్యోతిని (బౌద్ధమతమును) ప్రసాదించిన దేశమున నిపుడాంగ్లేయులు నల్లమందు అంధకారమును వెదజల్లిరి

* * *

చైనావారు మాకవద్దో ఈ నల్లమందుఅని నెత్తిన నోరుపెట్టుకొని మొత్తుకొనిరి ప్రభుత్వమువారు ఆ వ్యాపారమును అంతమొందించుటకు కఠిన శాసనములుచేసిరి కాని ఈస్టిండియా కంపెనీవారు (ఆంగ్లేయుల కంపెనీపేరు) ప్రతి చైనారేవు మార్గమునను నల్లమందు సమృద్ధిగా దేశములోనికి రహస్యముగా ప్రవేశించునట్లు సకలయత్నములు గావించిరి. తుదకు చైనా ప్రభుత్వాధికారులు కొకసారి ఆదొంగ దిగుమతి చిక్కినపుడు, వారా నల్లమందునంతయు నాశనముచేసిరి దానితో బ్రిటనుకు కోపమువచ్చెను, తనరొంద ఆది అగౌరవమనుచు, ప్రతిక్రియకై ౧౮౪౦లో యుద్ధము ప్రకటించెను

బ్రిటిషు యుద్ధనావలు క్యాంటను మున్నగు చైనారేవులను ముట్టడివేసెను రెండేండ్లవరకు చైనా ఎదిరించెను అంతటితో దానిఓర్పు సడలెను అందుచేతుదకు ఆంగ్లేయుల వ్యాపారమునకై అయిదు రేవుల నొసంగుటకును,హాంగ్‌కాంగ్ నిచ్చుటకును, నల్లమందు వ్యాపారము సాగనిచ్చుటకును ఒడంబడి, అవమానకరమగు సంధిపత్రముపై సంతకముచేయక తప్పదయ్యెను

* * *

ఇదియే ప్రారంభము చైనా క్షీణదశకు క్రీ॥ శ॥ ౧౮౩౯లో బ్రిటిషు సామ్రాజ్య చక్రవర్తినియగు విక్టోరియాకు చైనాచక్రవర్తి నల్లమందుచే చైనాకు కలుగుచున్న భయంకర ఫలితములనుగూర్చి మొరపెట్టుకొనుటకు ఒకజాబు వ్రాసెను ఈజాబునకు ౫౦ ఏండ్లక్రింద ఆంగ్లేయులు చైనాలో వర్తకము చేసికొనుట కనుజ్ఞకోరినపుడు అప్పటి చైనాచక్రవర్తి బ్రిటిషురాజుకు వ్రాసినజాబునకును భూమ్యాకాశములకుగల అంతరమున్నది ఈసారి వ్రాసిన జాబునకు జవాబుగూడ లేదు

ఇట్లు చైనా కవాటద్వారములు తెరువబడిన తర్వాత క్రైస్తవమత ప్రచారకులు అద్వారముగుండ ప్రవేశించిరి ఈక్రైస్తవమత ప్రచారకుల వర్యులు వారలు "సామ్రాజ్య కాంక్షాతత్వముయొక్క పురోగామి సేన యనిపించుచున్నట్లుండెను

* * *

చైనా కష్టములనేకములు క్రైస్తవమత ప్రచారకులు రాకుండినచో కలిగియుండెడివి కావు వారెప్పుడుజూచినను తలపొగరుతో వ్యవహరించుచుండిరి వారలకెట్టి మనో దుస్స్వభావముగనుండెను కాని చైనా శాసనముల ప్రకారము వారలను విచారించుటకు వీలులేదు వారలుచేసిన నేరములను విచారించు అధికారముగల న్యాయస్థానములే వేరు ఆప్రచారకులచే క్రైస్తవమతములోనికి మార్చబడినవారలను గూడ సామాన్యచైనా న్యాయస్థానములలో విచారణ చేయవీలులేదు

గ్రామస్థులిది సహించజాలక ఎదురు తిరిగినవారలై మిషనరీలపై బడినపుడు, వారలకు సహాయముగనుండిన సామ్రాజ్యసేనలువచ్చి చైనాకు మంచిశాస్తిచేసెను ఒకచారిత్రికుడిట్లునినాడు "చైనాలో క్రైస్తవమత ప్రచారకుల హత్యలవలె యూరపీయ రాజ్యములకు లాభించిన విశేషములు చాలఅరుదు ఎట్లన,అట్టి హత్యజరిగిన ప్రదేశ్ల అరాజ్యములు క్రొత్తహక్కులను, క్రొత్త సౌకర్యములను బెదరించి సంపాదించుటకు అవకాశము లభించెను

* * *

౧౮౫౦లో పెయిపింగులో జరిగిన తిరుగుబాటుకుగూడ క్రొత్తగా క్రైస్తవమతములో చేరిన హాంగ్‌హ్సూయి చువాన్ అనువాడే మూలకారకుడు "విగ్రహారాధకులను చంపుడు" అను అతని ఘోషలతో దేశము మండిపోయెను క్రైస్తవమత ప్రచారకులు మొదట అతనిని ప్రోత్సహించుచుండినను, తుదకు అతని నాయకత్వమును నిరసించి త్రోసివేసిరి కాని జరుగవలసిన ఉపద్రవమంతయు అప్పటికే జరిగియుండెను తిరుగుబాటు అంటుకొని పంద్రెండేండ్లకాలము సాగెను దానికి రెండుకోట్ల ప్రాణములు ఆహుతియై, చైనా ఎడారియయ్యెను

ఇక చైనీయులకు మిషనరీలయెడ ప్రేమయేలయుండును? "మొదట మిషనరీలు, తర్వాత తుపాకుల నావలు, తర్వాత భూమిపంపకములు —ఇది చైనావారల మనస్సులందు తాండవమాడుచున్న ఘోరదృశ్యము "అని ఆకాలపు ఆంగ్లేయ చరిత్రకారుడొకడు వ్రాసెను

ఈతిరుగుబాటులో బ్రిటిషువారికి మరల క్రొత్తహక్కులు సంపాదించుటకు అవకాశము లభించెను చైనాదేశపు రేవులలో నొకటియగు క్యాంటనువద్దనుండు గవర్నరగు చైనా సముద్రపుదొంగల ఓడను ౧౮౫౬లో పట్టుకొనెను ఆఓడలో విదేశీయులెవరును లేకుండిరి కాని ఆఓడపై బ్రిటిషుపతాకము ఎగురుచుండెను పట్టుకొన్నఓడ దొంగలదేయగుగాక, దానిపై బ్రిటిషు పతాక మెగురుచుండినపుడు దానిని గౌరవించకుండ పట్టుకొనుట ఎందుకు—అని బ్రిటిషువారు సాకుజెప్పుచు ౧౮౫౭లో యుద్ధము ప్రకటించిరి

తిరుగుబాటులో ఫ్రెంచి మిషనరీని ఒకరిని చైనావారు బంధిరము సాకుతో ఫ్రాన్సు దేశముకూడ ఈసారి యుద్ధములో చేరెను బ్రిటిషు ఫ్రెంచిసేనలు కలిసి,ఒకప్రక్కచే పింగుతిరుగుబాటు జరుగుచుండగనే, చైనాపైబడిరి,

వారలు రష్యాను, అమెరికాను కూడ తమతో కలిసియుద్ధము చేయుటకు పిలిచిరి కాని రష్యా, అమెరికాలు యుద్ధములో పాల్గొనుట కంగీకరించలేదు, కాని తర్వాత యుద్ధఫలితములను పంచుకొనుటకు సంసిద్ధముగనుండెను. ఆసలింతకును యుద్ధమనునది జరుగనేలేదు. కాని ఎక్కువహక్కులు, లాభములను సంపాదించుసంధిని ఫ్రాన్సు బ్రిటనులు సూచించెను ఆసంధిపత్రముపై చైనా, ఫ్రాన్సు,బ్రిటనులతో బాటు అమెరికా రష్యాలుగూడ సంతకములు చేసెను ఈసంధిచే మరికొన్నిరేవులలో ఆనాలుగుదేశముల వ్యాపారము సాగుటకు చైనా ప్రభుత్వము అనుమతించెను

చైనా అవమానమింకను పరిపూర్తి కాలేదు చేసికొనబడిన సంధిని చైనా ప్రభుత్వమువారు పెకింగులో ధ్రువపరచవలసిన సమయమువచ్చినపుడు ఇంకను కష్టములు సంభవించెను

అసమయమున పెపింగుపట్నముపైకి తిరుగుబాటుదారులు రానుండిరి చైనా ప్రభుత్వమువారు నగరమును సంరక్షించుటకై నగరమునకు అనుకొనియుండు నదిమీదుగా ఎవరుగాని రా వీలులేకుండ కట్టుదిట్టములు చేసిరి,

అందుచే చైనాలోనుండు వివిధరాజ్యముల రాజకీయప్రతినిధులు వేలమార్గమున పెకింగునగరమునకు రావలసినదని చైనా ప్రభుత్వమువారుకోరిరి. రష్యా,అమెరికాలు అందుకు అంగీకరించెనుగాని, ఇతరులు తమఓడలను నదిమీదనే తీసికొనిపోవుటకు పట్టుబట్టిరి అట్లు నదీమార్గమున నగరములోనికి రాకుండ అడ్డముకట్టబడిన ఏర్పాట్లనన్నిటిని వారలుభగ్నముచేసిరి దానిపై చైనా సైనికులు తుపాకులుప్రేల్చిరి

ఫ్రాన్సు,బ్రిటనులకు సాకుదొరకినది ౧౮౬౦లో వారలసేన లొక్కుమ్మడిగ పెకింగుపైబడి దోచుకొనదగిన దానినంతయు దోచుకొని, మంటపెట్టినవి ప్రాచీన చైనాజాతీయ కళావైభవ నిదర్శనములుగ నిలువదగిన వస్తువులన్నియు భస్మీపటలము చేయబడెను ఈమరంతమంతయు చెంగిస్ ఖానుయొక్క క్రూరకృత్యములను స్ఫురణకు దెచ్చుచున్నది

ఆదెబ్బతో సంధి ధ్రువపరచబడుటయేగాక, క్రొత్తహక్కులుకూడ లభించెను

ఈ ఇంతఘోరము జరగునప్పటికి చైనాగుండెపగిలెను ఒకసారి చైనాదృష్టి ప్రాచీననాగరికతా వైభవముపై నిగుడింపబడెను ఆనాగరికతయంతయు ఇప్పుడు విదేశవర్తకులచే మట్టిపాలు చేయబడుట చైనాకు ఆగ్రహము కలిగించెను ఇట్లు చైనా జాతీయభావము అంకురించెను నాయకులు నవ్యయుగోదయమునకై ప్రచారముచేయసాగిరి, తుదకు ౧౮౬౪లో తిరుగుబాటు అణచివేయబడెను టుహ్సీ చక్రవర్తిని క్రింద విదేశరాజ్యములు ఇంకను ఎక్కువహక్కులను సంపాదించుటకై చేయు ప్రయత్నములు పూర్వముకంటె ఎక్కువపట్టుదలతో ఎదిరించబడసాగెను చైనా నల్లమందుని క్రమముగా మేలుకొనుచుండెను

కాని ఈసారి మరియొక క్రొత్త భయంకర పిశాచము బయలుదేరెను జపానుఇప్పుడే క్రొత్తగా మహోద్రేకముతో సామ్రాజ్య క్రమణకు ప్రారంభించుచుండెను.

జపానుకూడ చైనావలె యూరపీయుల వర్తకులకోరికల నెదిర్చి వారితో యుద్ధములలో ఓడి, తన ఓడరేవులనన్నిటిని వారికి సమర్పించి దుఃఖములనుభవించినదే.

కానిఇపుడు, యూరపీయులను మించిపోయినది నీతి చాతుర్యమందును, వేషాడంబరములందును, ఇతరలౌకిక వ్యవహారపు నేర్పునందును పాశ్చాత్యులను వెనుకద్రోసి, ప్రపంచమునకు ఆశ్చర్యముకలిగించుచు సామ్రాజ్య నిర్మాణములో ముందునడుచుచుండెను సుప్రసిద్ధ చరిత్ర గ్రంథకర్త హెచ్.జి వెల్సు ఇట్లనినాడు "కొలమున జపాను సాధించినంత అభివృద్ధిని మానవపుచరిత్రలో మరెప్పుడును మరే ఏజాతిగాని సాధించియుండలేదు ౧౮౬౬లో జపానీయులు మధ్యయుగమునాటి వారుగనుండిరి ౧౮౯౯లో వారలు సంపూర్ణముగ పాశ్చాత్యజాతులతో భుజములు రాచుకొనుచు, రష్యాకంటె ముందుపోవుచుండిరి జపాను అభివృద్ధియందు యూరపీయాభివృద్ధి యంతయు మందముగను అస్థిరముగను కనబడుచుండెను"

అట్టిజపాను తక్కిన సామ్రాజ్య కాంక్షలకుతోడ ౧౮౯౪-౯౫లో చైనాపైబడెను జపాను నౌకాదళమును, సైనికదళమును అతి బలవంతముగ నుండుటచే వెంటనే జయముకలిగెను కాని చిక్కినదానిని దోచుకొనిపోవుటకు రష్యా, ఫ్రాన్సు జర్మనీలు అటంకపడెను జపాను బిత్తరపోయి వెంటె మొగము వేసికొనెను కాని జరిగినదానిని జ్ఞాపక ముంచుకొని ౧౯౦౪లో రష్యాతో జరిగిన యుద్ధములో తగిన ప్రతిక్రియ చేసెను.

ఈలోగా ఇతర రాజ్యములు చైనాను పొడుచుకొని తినుచునే యుండెను, ప్రభుత్వమువారును, ప్రజలునుకూడ ఇదిచూచి ఏమిటీ ఘోరమని ఆందోళనజెంది తమయిల్లు చక్కబెట్టుకొనుటకు తలపెట్టిరి ౧౯౦౦లో బాక్సరీర్ తిరుగుబాటు ప్రారంభమయ్యెను

బాక్సర్లన, ప్రతినగరమందును, నగర సంరక్షణార్థమై ఏర్పరచబడిన అనధికార సైనిక సంఘములలో చేరిన దేశభక్తి ప్రేరితులగుపర్యులు వీరలదేశభక్తి అపారము వారలకు క్రైస్తవమత ప్రచారకులనిన మంట కావునవారలకు క్రైస్తవమత ప్రచారకులతోను, విదేశీయులతోను సంఘర్షణ తప్పదయ్యెను ఎక్కడచిక్కిన విదేశీయుడచ్చటనే చంపబడెను ఈఉద్యమము వేగముగ దేశములో చాలభాగమున వ్యాపించెను మూర్ఖకొంది విదేశీయులు చంపివేయబడిరి

ఇదిసాకుజేసికొని విదేశీయులు అందరును కలిసి ఒకసేన తయారుచేసిరి అది జర్మను సేనానాయకునిక్రింద పెకింగులో విదేశీయరాజ్యముల ప్రతినిధులను ముట్టడినుండి విడిపించుటకు బయలుదేరెను జర్మనీచక్రవర్తి కెయిజరు తనసేనకు హూణులవలె నాశనము చేయవలసినదని ఆజ్ఞనొసంగెను సైనికులు కనీవిని చెప్పినదాని కంటె నాశనంల నాశనముచేసిరి సేనలు పోవునపుడు వేలకొలది స్త్రీపురుషులు విదేశసేనల చేతులలోచచ్చుటకంటె ఆత్మహత్యయే మేలనుకొని అభిమానముతో ఆత్మహత్య చేసికొనిరి

ఆయుద్ధముతోకూడ నుండిన ఒక బ్రిటిషు విలేఖరి తనపత్రికకు ఇట్లువ్రాసెను "నేను వ్రాయగూడని సమాచారములున్నవి ఇంగ్లాండులో ప్రకటించబడగూడని విషయములున్నవి. దీనినిబట్టి కనబడునదేమనగా, ఈ పాశ్చాత్య నాగరికతయంతయు మెరుపుతనము కప్పుకొనబడిన బొరయనియే. ఏయుద్ధమునుగూర్చిగాని నిజము వ్రాయబడలేదు,ఈయుద్ధముకూడ అంతే"

సేనలు పెకింగుచేరినపుడు చెప్పరాని ఘోరములు జరిగెను మనోహరమైన నగరము దోచుకొనబడెను ఎచటను లభించనట్టి అపూర్వ ప్రాచ్యకళా విభవములు అకారణముగ నాశనము చేయబడెను.

అంత ౧౯౦౧సంవత్సరపు పెకింగు ప్రొటోకల్ అనుసంధి చేసికొనబడెను ఈసంధిచే పూర్వముకంటె మించిన అవమానములు చైనాపైబడెను మరికొంతముక్కగా చైనారాజ్యము ఆక్రమించుకొనబడెను,

౧౯౦౪లో రష్యాజపానుల యుద్ధమున్న, వివిధరాజ్యముల పరస్పరకలహములును చైనాకు ఊపిరియాడుటకు కొంతఅవకాశమిచ్చెను

కాని జపానుపింహమునుండి చైనా ఇప్పటికిని తప్పించుకొనజాలకున్నది చైనాలో ప్రజాపాలన మేర్పడినది కద యట్ సేన గారు పరిస్థితులను చక్కబెట్టి పునర్నిర్మాణము చేసిరి కాని ఎన్నిజరిగినను జపానుబాధతప్పలేదు ఇప్పుడా జపాను ఇతర రాజ్యములను బెదరించి అవతలకుత్రోసి తానొకతే చైనాను పొడుచుకొని తిన జూచుచున్నది

---

## శ్రేష్ఠమైననాలుగుప్లాట్లభూమి వేలము

నారాయణగూడెము లింగంపల్లిరోడ్డున రాజ బహద్దరు వెంకటరామారెడ్డి ఒ. బి. ఇ. స్పెషలు అఫ్సరు ముబారికుగారి ఇంటిప్రక్కన నైయం. సి. ఎ. ఎదురుగాయున్న నాలుగుప్లాట్లు భూమి ౧ దై ౧౩౪౭ ఫ. శుక్రవారము నాలుగు గంటలకు హర్రాజుకాగలదు. ఈనాలుగుప్లాట్లుగాక మరి మూడుప్లాట్లు గలవు- ౭౦౦ నుండి ౯౦౦ల గజములవరకును గలవు ఎల్కట్రిక్కు, నల్లాలు, డ్రైనేజుకూడ గలవు హర్రాజుకుముందుగా వెళ్లి భూమిని చూచుకొనవచ్చును

శ్రీ మదనరాయ లాలాగోవర్ధనదాసు
కమీషను ఏజంటు
అంకు అక్షసీర్ 593 హిమ్మతుగంజు
నాతురాం బజారు, సుల్తాను బజారు, హైదరాబాదు, దక్కన్.

---

వచ్చినవి! వచ్చినవి!

హిందూస్తాన్ కంపెనియొక్క తెలుగుభాషయందలి రెండుఫలిరికార్డులు.

అరోరాఫిలిం గొప్పచిత్రమగు

## "విప్రనారాయణ" పాటలు

మిస్ కంచనమాా, మాస్టరు కస్తూరీ నరసింగరావు

| | | |
|---|---|---|
| హెచ్ ౧౧౫౩౦ | తెలుగుపాటలు | విప్రనారాయణఫిలిం |
| | ,, | ,, |
| హెచ్ ౧౧౫౩౧ | తెలుగుపాటలు | విప్రనారాయణఫిలిం |
| | ,, | ,, |

అరోరాఫిలింవారి ప్రతిభావంతమగు విప్రనారాయణయందలి అపూర్వకథానాయకులగు మిస్ కంచనమాలా, మిస్టర్ కస్తూరిగారు ఫిలింనందలి యుత్తమ ఆనందకరమగు నాలుగుపాటలు హిందూస్థాన్ రికార్డులలో నింపినారు నేటి తెలుగు రికార్డులలో యివి అత్యుత్తములని తేల్చబడినవి. వినటకు యోగ్యమైనవి

ప్రతిరికార్డు వెల రెండురూపాయిల నాల్గణాలు

సోలు డిస్ట్రిబ్యూటరు

బి. జి. చిమ్మలిగి, జాంబాగు

---

## మ. ఘ. వ. నైజాం స్టేటు రైల్వే

### 1937 లో యాత్ర

10 నవంబరు 6 దై బుధవారమునాడు

## వరంగల్-రామప్పయాత్ర

రానుబోను చార్జీలు, రైలు, బస్సు, ఆహారమునహా

| | | పెద్దలు | పిన్నలు |
|---|---|---|---|
| 2 తరగతి | బి. జి రూ | 9-12-0 | 7-0-0 |
| 3 తరగతి | ,, | 5-4-0 | 3-13-0 |

ఉపవాసమున్నవారికి ప్రత్యేకముగా, యిస్తకి సెహరి, ఏర్పాట్లు చేయబడును.

ఇతర వివ కమ్షర్షియల్ మేనేజరుకు వ్రాయవలెను

---

## మ. ఘ. వ. నిజాం సంస్థానపు రైల్వే

### విద్యార్థుల సంచారములకుగాను ఛార్జీలలో ఆకర్షకములగు తగ్గింపులు

యం. యస్. యం, యస్. ఐ., మరియు మైసూరు రైల్వే కంపెనీలతో కలిసి, విద్యార్థుల ప్రచారమునకై ప్రత్యేకముగ తగ్గింపు ఛార్జీలను ఏర్పాటు చేసినాము

తగ్గింపుఛార్జీలలో ముప్పది నిండుటిక్కెట్లకు సరిపోవునంత మంది ఇప్పుడు దక్షిణ హిందూదేశములోనినాలుగు పెద్ద రైల్వేలలో (యస్- యస్- ఆర్ మైసూర్, యం. యస్ యం, యస్ ఐ రైల్వేలు—నీలగిరి రైల్వే కూడ లెక్కలోచేరును, కాని షోరానూరు. నీలాంబుర్ రైల్వే చేరదు) మొదటి రెండవ తరగతులలో సగము ఛార్జీతోను, ఇంటర్ తరగతిలో మూడవ తరగతి మెయిలుఛార్జీతోను, మూడవతరగతిలో మూడవతరగతి మెయిలులో ఛార్జిలో సగముతోను ప్రయాణము చేయవచ్చును. ఇంతేగాక విద్యార్థులు ప్రయాణము చేయు తరగతి పెట్టెలోనేముప్పదినిండు తగ్గింపుఛార్జీటిక్కెట్లకుసరిపోవునంతమంది విద్యార్థుల జట్టుఒక్కొక్కదానితోనుఒకప్రొఫెసర్ లేక ఉపాధ్యాయుడుప్రయాణము చేయవచ్చును.

ప్రతిజట్టులోను, ఒకటేబడిలోచదువు విద్యార్థులు పిల్లలైనను, లేక వేర్వేరుబళ్లలో చదువువారలైనను ఉండవచ్చును. కాని వారలు ఒకటేరైలుబండిలో కలిసియుండవలెను. అయినను ఒకటేతరగతి పెట్టెలో నుండవలెనని నిర్బంధము లేదు.

మొదటి, రెండవతరగతి ప్రయాణికునికి ఒక్కొక్కనికి ఒక్కొక్కపరువు వంతునను, ఇంటరుతరగతిలో ప్రతిప్రయాణికునికి ఒక్కొక్క సీటు వంతునను మూడవతరగతిలో ప్రతిపెద్దవానికి రెండుసీట్లు, ౧౨ఏండ్లలోపలనుండుప్రతివానికి ఒక్కసీటువంతునను రైల్వేవారు ఏర్పాటుచేసెదరు.

ఈతగ్గింపుఛార్జిటిక్కెట్టు మైసూరు రైల్వేలలో బెంగుళూరు- మైసూరు శాఖలోదప్ప తక్కినశాఖలబండ్లకును మెయిలులో దొరుకును

ఇంటర్‌తరగతిలో తగ్గింపు యస్. ఐ, మరియు మైసూరురైల్వేలలోదొరకదు యన్. యస్. రైల్వేలలో బెజవాడ—బల్లార్షా శాఖపై గ్రాండ్‌ట్రంక్ యక్స్‌ప్రెస్‌లో ఇంటర్ తరగతియందు తగ్గింపుఛార్జి లభించును

ఇతరవివరములకు ఈ క్రిందివారికివ్రాసి కనుకొనుడు

చీఫ్‌కమర్షియల్ మేనేజర్.
యన్, యస్, రైల్వే,

---

The only Leading National Bi-weekly of the whole Andhra Desa

GOLKONDA PATRIKA is The best medium for all traders and dealers — Advertise at once

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA PATRIKA is The only popular voice of 7,000,000 Andhras of THE NIZAMS DOMINIONS

Volume 12 | HYDERABAD - DECCAN | Monday 1 St November 1937 | Number 49

# నిజామాబాదు రైతుల వాంఛ

## అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశము

### పదవీ స్వీకరణ ఫెడరేషన్ ప్రతిఘటన

### పదవీ వ్యామోహమునకు లొంగగూడదని అధ్యక్షుని హెచ్చరిక

### మైసూరు ప్రభుత్వ విధానమునకు నిరసన తీర్మానము

కలకత్తా అక్టోబరు ౨౯

నేడు ౧-౪౫ గంటకు కాంగ్రెసు మహాసభాధ్యక్షులగు పండిత జవాహర్లాలు నెహ్రూగారు కార్యవర్గసభ్యులతో సహా వేదికవాయిద్యములు మ్రోగుచుండ, జాతీయగీతములు పాడుచుండ వెల్లింగ్టను స్క్వేరులో ప్రత్యేకముగా నిర్మింపబడిన సభాశాలలోని కేతెంచిరి



సభాశాలలో వేలకొలది ప్రేక్షకులుండిరి

అధ్యక్షుడు సభను ప్రారంభించుచు "కాంగ్రెసు మంత్రివర్గము లేర్పడుటవలన జన సామాన్యమునకు కాంగ్రెసుపై అభిమానము హెచ్చినది దేశములో కాంగ్రెసు బలము, పలుకుబడి అధికమైనది ప్రజలలో ఉత్సాహము అతిశయించి స్వరాజ్య సంపాదనా దీక్ష దృఢమగుచున్నది పదవీ స్వీకారమువలన ఉద్యమమునకు దౌర్బల్యము కలుగవచ్చునుకాన జాగరూకతతో మెలగవలయును పదవీ వ్యామోహములందు మన స్వరాజ్య సంపాదనా ప్రయత్నమునందేమరగూడదు" అని తెలిపిరి

#### పదవీ స్వీకారము

కార్యవర్గమువారిచే ఆమోదింపబడిన పదవీ స్వీకార తీర్మానమును సర్దారు వల్లభభాయి పటేలుచే ప్రతిపాదింపబడి, నరేంద్రదేవుచే సమర్థింపబడి ఏకగ్రీవముగా ఆమోదింపబడెను

#### ఫెడరేషన్ ప్రతిఘటన

ఫెడరేషన్ స్థాపింపబడకుండ ప్రతిఘటించుటకై కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గముచే ఆమోదింపబడిన తీర్మానమును మౌలానా అబుల్ కలాం ఆజాదు ప్రతిపాదించెను భూలాభాయి దేశాయిగారు సమర్థించిరి మదరాసు ప్రతినిధి గోపాలరత్నంయొక్క చిన్న సవరణను మౌలానాగారంగీకరించిరి "ఫెడరేషను ప్రతిఘటించుటకు పదవులను త్యజించి నిరోధములను కల్పింపవలెను" మాసాని, "ప్రజలచే ఎన్నుకొనబడు ప్రతినిధులుగల ఫెడరేషన్ యేర్పడవలెను కాని బ్రిటిషిండియాలోని రాష్ట్రములకును, సంస్థానములకును ఫెడరేషన్ ఉండగూడదు" అని సత్యమూర్తి "తీర్మానములోని కడపటివాక్యమును తీసివేయవలయును" అని ఆచార్యరంగా, "ఫెడరేషన్‌కు సంబంధించిన అన్నివిషయములను కాంగ్రెసువారు ప్రతిఘటించవలెను" అని శ్రీప్రకాశ, "ప్రజలకును, సంస్థానాధిపతులకును జరుగుచున్న సంఘర్షణలో [illegible] ఫెడరేషను ప్రతిఘటించవలెను" అని జగన్నాథం "ఫెడరల్ అసెంబ్లీ యెన్నికలను కాంగ్రెసువారు బహిష్కరించవలెను" అని వినోదరాయ, "ప్రతికూలసభలను జరుపవలయును" అని నిగ్వేకర్ సవరణలను ప్రతిపాదించిరి

ఈసవరణ అవసరములేదని భూలాభాయి దేశాయిగారు గంభీరోపన్యాసము నొసగగా సత్యమూర్తి, రంగా, విద్యా, వినోదరాయి గారు సవరణలు వదలుకొనిరి. మాసాని సవరణ ను జయప్రకాశనారాయణ, రఫీ అహమదు కిద్వాయిగారలు బలపరచిరి

వోట్లు గైకొనగా శ్రీప్రకాశు సవరణకు ౩౧ గురు అనుకూలురును, రాజీగరు ప్రతికూలురును, మాసాని సవరణకు ౭౧మంది అనుకూలురును, ౯౨మంది ప్రతికూలురును నుండుటచే సవరణలు వీగిపోయెను

అసలు తీర్మానము వోటుకుపెట్టగా యిద్దరు మాత్రమే వ్యతిరేకసమ్మతుల నొసగుటచే తీర్మానము బహుజనాభిప్రాయ ప్రకారము అంగీకరింపబడెను

#### రెండవ దిన సమావేశము

కలకత్తా అక్టోబరు ౩౦

నేడు మధ్యాహ్నము ౧-౨ గంటలకు అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశము మరల పండిత నెహ్రూ యాజమాన్యమున సమావేశమైనది ఈ సమావేశమునందు బెంగాలు ప్రతినిధి రాజకుమారి చక్రవర్తి "వందేమాతరం" గీతము విషయమై కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘ తీర్మానముపై చర్చగావించుటకవకాశ మొసగవలయునని యు, విద్యా కాంగ్రెసు ప్రభుత్వశాఖలను చర్చించుటకవకాశ మొసగవలసినదనియు అధ్యక్షుని కోరిరి అధ్యక్షుడు అధికారతీర్మానముల పిమ్మట సమయమున్న చర్చించవచ్చునని తెలిపిరి

జాంజిబారు, మారిషసు మున్నగుదేశములయందలి భారతీయుల కష్టములను గూర్చిన తీర్మానములు, ప్రవాస భారతీయుల తీర్మానము అధ్యక్షునిచే ప్రతిపాదింపబడి అంగీకరింపబడెను

మిడ్నపూరు జిల్లాలో కాంగ్రెసు నిషేధములకు నిరసనము ప్రకటించు తీర్మానము సుభాషు చంద్రబోసుచే ప్రతిపాదింపబడి సత్యమూర్తిచే బలపరచబడి అంగీకరింపబడెను

చిటగాంగు యువకులపై ప్రయోగింపబడిన ఉత్తరువులనుగూర్చిన తీర్మానము దత్త మజుందారుచే ప్రతిపాదింపబడి అంగీకరింపబడెను

పాలస్తయిను తీర్మానము అధ్యక్షుడు ప్రతిపాదించగా ఏకగ్రీవముగా అంగీకరించబడెను.

కాంగ్రెసు మంత్రివర్గముల కార్యక్రమమును విమర్శించుచు మాసానిచే ప్రతిపాదింపబడిన తీర్మానమునకు సవరణ ప్రతిపాదించుచు గాడ్గిల్ ఉత్సాహపూరితోపన్యాసము గావించెను బొంబాయి మంత్రివర్గమును ప్రశంసించుచు కేరళలో నొక రాంకేము నిర్బంధితుడై యున్నాడనియు, సంస్థలపై నిషేధములన్నియు తొలగింపబడినవనియు తెలిపిరి మదరాసు ప్రధానిపై విశ్వాసముంచవలెనని తెలిపిరి

మస్తూరి అన్నపూర్ణయ్య నిర్మా గారలు మదరాసు మంత్రివర్గమును విమర్శించుచు ఉపన్యసించిరి అయ్యదేవర కాళేశ్వరరావు గారు మంత్రివర్గమును ప్రశంసించుచు కార్యకలాపమును వివరించిరి కమలాదేవి చటోపాధ్యాయ తీవ్రముగా విమర్శించిరి సర్దారు వల్లభభాయి పటేలు, గోవిందవల్లభపంతు గారలు మంత్రివర్గమును ప్రశంసించిరి

## ఆరవ ఆంధ్ర మహాసభ

### స్థాయిసంఘ కార్యదర్శుల ప్రకటన

హైదరాబాదు అక్టోబరు ౨౮

ఆంధ్రమహాసభ స్థాయిసంఘ కార్యదర్శులగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి, మందుముల రామచంద్రరావుగారలిట్లు ప్రకటించుచున్నారు

ఆరవ ఆంధ్రమహాసభ నిజామాబాదునందు ౩-౮-౪౬ బహమన్ ౧౩౪౭ ఫ (మార్గశిరశు॥ ౩-౪-౫) సోమ, మంగళ, బుధవారములలో సమావేశమగును

మహిళామహాసభకు శ్రీమతి నందగిరి ఇందిరాదేవిగారు బి ఏ అధ్యక్షతవహించెదరు

రయ్యతుపత్రికా సంపాదకులగు శ్రీ మందుముల నరసింగరావుగారు ఆంధ్రమహాసభ కధ్యక్షతవహించెదరు

నిజామాబాదు రైల్వేస్టేషనుగల ప్రదేశము రాకపోకల సౌకర్యములుగలది. మూడవతరగతి రైలుకిరాయి రు ౩-౧౨-౦ మాత్రమే గతసంవత్సరమువలెనే స్పెషల్ ట్రేన్ ఏర్పాట్లు గావింపబడును

మహాసభలో ప్రవేశపెట్టబడు చిత్తుతీర్మానములు ౨౦ వ తేదిలోగా స్థాయిసంఘ కార్యాలయమునకు పంపవలయును

ప్రతినిధిఫారములు సిద్ధమైనవి ప్రతినిధులుగా చేయుటలో ఉపేక్షవహించగూడదని ప్రార్థించుచున్నాము ప్రతినిధిరుసుము ఒకరూపాయిమాత్రమే

## ఆంధ్రులు నిరుత్సాహ పడవలదు

### జాత్యభివృద్ధికి పలన ధైర్యముతో స్వయంసహాయము, స్వార్థత్యాగ మత్యావశ్యకములు

—బులెటిన్,

లక్నో విశ్వవిద్యాలయ రాజనీతి శాస్త్రశాఖాధ్యక్షులు, జినీవా అంతర్జాతీయ సమితి కార్యదర్శులగు డా వంగల శివరాంగారు స్థానికాంధ్రులతో పరిచయము కలిగించుటకు శ్రీకృష్ణ నిలయమునకు విజయము చేసిన సందర్భమున శ్రీ మాడపాటి హనుమంతరావు డా శివరాంగారికి హైదరాబాద సంస్థానవిషయముల పరిచయము కలిగించుచు విద్యావంతుల సంఖ్య, జనపరిగణన నివేదికల వలన, ప్రతిశతి

---

సవరణ వోటుకు పెట్టబడగా ౯౯ మంది అనుకూలముగాను, ౫౭ మంది ప్రతికూలముగాను సమ్మతులొసగుటచే సవరణ అంగీకరింపబడెను

అధ్యక్షులగు నెహ్రూగారు పనుల తొందర వలన తమ అసాం పర్యటనము డిసెంబరు మాసమువరకు వాయిదా వేసినట్లు ప్రకటించిరి

#### మూడవదిన సమావేశము

కలకత్తా ౩౧ అక్టోబరు

నేటి సమావేశమునందు శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారు మైసూరు సంస్థానప్రభుత్వ నిర్బంధము లకసమ్మతిని ప్రకటించు తీర్మానమును ప్రతిపాదించిరి మైసూరుప్రజల ధైర్య, సాహసములను ప్రశంసించుచు బ్రిటిషిండియా సంస్థానప్రజలు మైసూరుప్రజలకు సాధ్యమగునంత సహాయము చేయవలయునని కోరిరి

గాడ్గిల్, ఆచార్య ఇంద్ర గారలు ప్రతిపాదనను సమర్థించిరి కె ఎఫ్ నారిమెన్ గారు తీర్మానమును బలపరచుచు మైసూరుదివాన్ రాజనీతిజ్ఞుడనియు, వీరు రామస్వామిమొదలారు, సర్ సామ్యూల్ హోరును ననుసరించుచున్నారనియు, సంస్థానమువందు వచ్చువారలపై ఆవరణలొనకి చెప్పుటకై ప్రభుత్వము ముద్రితఆజ్ఞలను తయారు మంచుకొనినట్లు తోచుచున్నదనియు తెలిపిరి

తీర్మానము ఏకగ్రీవముగా అంగీకరింపబడెను

పునః సమావేశము రెండు నెలలలోగా సమావేశమగునని అధ్యక్షులు ప్రకటించిరి

సమావేశము నేటితో సమాప్తమయ్యెను

---

౫ అనియు, వలయునన్ని రాత్రి పాఠశాలలు విద్యావ్యాపకమునకు లేవనియు, జనాభాయందు ప్రతి ౯౦ మంది రాష్ట్రమునందాంధ్రులున్నను ప్రతి ౧౦ మంది ప్రజల వారియుర్దుభాషను పాఠశాలలలో, కళాశాలలలో బోధనా సాధనముగా నిర్ణయింపబడుటవలన ఆంధ్రుల కన్యాయము జరుగుచున్నదనియు, మద్రాసు విశ్వవిద్యాలయమునకు చెందిన నిజాంకాలేజియందు ౩౦౦ విద్యార్థులు మాత్రమే చేర్చబడిరనియు, ౩౦౦ విద్యార్థులకు ప్రవేశము నిరాకరింపబడెననియు, స్త్రీ విద్యావిషయ మంతగా వివరింపదగినస్థితియందు లేదని విశదపరచిరి

డాక్టరు గారిని పుష్పమాలాలంకృతు లొనర్చి పిదప స్థానికఆంధ్రుల అభివృద్ధికి మార్గములు సూచింపుడని విశదపరచ డాక్టరుగారిట్లు వివరించిరి —

బెంగాలు, మధ్యరాష్ట్రపు ఆంధ్రులకన్న యిచ్చటి ఆంధ్రులు వెనుకబడియుండుట చాల విచారకరము గా గలదు తమిళప్రాంతములందలి సోదరులలోగల వలసపోవు ధైర్యము సాహసము వీరియందు కనబడుటలేదు సర్ యస్ రాధాకృష్ణగారు తప్ప ప్రపంచజ్ఞానమునకు సేవచేసిన మరొక ఆంధ్రుడెవడును కనపడుటలేదు తమ పొరుగువారవలంబించిన పద్ధతు లనుకరించు టత్యవసరము స్థానిక ఆంధ్రులు గడించిన గొప్పాభివృద్ధి, కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము సలిపిన కృషి సంతృప్తికరముగా గలదు స్వయంసహాయము స్వార్థత్యాగమే అభివృద్ధికి అత్యవసరములు ఫెడరేషన్ ప్రవేశముతో ప్రతివర్గమునకు, తెగకు సమానత్వములు ప్రసాదించుటకు ప్రతిసంస్థయు ప్రయత్నించుటకు భావి కాలమున హైదరాబాద ఆంధ్రులు నిరుత్సాహపడు టనవసరము ఆంధ్రమహాసభ మదరాసుతో మీ లేఖలు గావలయును రాజకీయములకు గాక వ్యవహారాభివృద్ధికి మహాసభలు సాహసించవలయును ఆంధ్రులకు ప్రత్యేకముగా ఆంధ్ర విశ్వవిద్యాలయ మున్నప్పుడు మద్రాసుతో సంబంధము త్యజించుకొనవలయును. విద్యావిషయమునందభివృద్ధి పడయుటకు హైదరాబాదయందు మరొక కళాశాల స్థాపించవలయును తనను గౌరవించినందులకు కృతజ్ఞత తెలిపిరి.

## ప్రభుత్వ శిస్తులను తగ్గించవలసిన అవసరము

### ప్రధానమంత్రికి నిజామాబాదు రైతుల వినతిపత్రము

### 'పంచదార కర్మాగార స్థాపనవల్ల రైతుల కష్టములీడేరును'

— సర్ అక్బర్ హైదరీ

("గోలకొండ" ప్రత్యేకవిలేఖరి)

నిజామాబాదు అక్టోబరు ౨౮

౧. నిజాంసాగరు కాలువ నిబంధనావళి లాభకరముగా లేదు.

౨. రైతుల పురోభివృద్ధికి బందోబస్తు నిబంధనలు, ఇర్రిగేషన్ విధానము [పాలసీ] శిస్తులు ఆటంకములుగా నున్నవి. కావున రైతుల కనుకూలముగా నుండునట్లు నిబంధనలు సవరింపబడి, శిస్తులందు తగ్గింపు చేయవలయును

౩. స్వదేశపరిశ్రమ ప్రదర్శనములందు దేశీయ పరికరములు మాత్రమే ప్రదర్శింపబడుచు, దేశీయ వస్తువులు చౌకగా లభించునటుల చేయవలయును.

౪. ప్రస్తుతము రైతులకు సహకార శాఖ పక్షమున నొసగబడుచున్న ఋణములను తీర్చుకొనుటకై చెల్లించబడుచున్న మొత్తము అసలు మొత్తమునందుగాక వడ్డీయందు మినహాయించుకొన బడుచున్నది ఇందువలన రైతులకు అధికమగు నష్టము కలుగుచున్నది కావున ముందునుండి రైతులచే చెల్లింపబడు మొత్తములు అసలు మొత్తమునందు మినహాయించుకొని ఋణము తీరిన పిమ్మట వడ్డీ రాబట్టుకొనవలయును

౫. నిజామాబాదు జిల్లా ప్రజలకు వైద్యసౌకర్యములు అసంతృప్తికరములుగా గలవు గ్రామములందుగల ప్రజలకు ఉచితమగు సహాయము ఆయుర్వేద వైద్యమువలన చేకూరును గాన ఆయుర్వేద వైద్యాలయములు విరివిగా స్థాపింపబడవలయును అధునిక విద్యాసౌకర్యముల ప్రసాదనవలన గ్రామములనుండి శిక్షణబడయుటకు విద్యార్థులెందరో వచ్చుచున్నారు వారినివాస, భోజనములకు యెట్టి సౌకర్యములులేవు కావున నిజామాబాదునందు విద్యార్థి వసతిగృహము నెలకొల్పవలయును

౬. గ్రామీయులందు విజ్ఞానాభివృద్ధికై లోకల్బోర్డు పోషకత్వమున గ్రంథాలయములు, పఠనాలయములు విరివిగా స్థాపింపబడవలయును

౭. జాగీరు రైతులకు ఖాల్సా రైతులతో సరిసమానమగు హక్కులు, రక్షణలుండుట అవసరము గాన ఖాల్సాశాసనములన్నియు జాగీరులందు వర్తించునట్లు చేయవలయును.

పై ముఖ్యాంశములుగల నిజామాబాదు జిల్లా రైతుల వినతిపత్రమును ప్రధానామాత్యులగు నవాబు సర్ హైదరు నవాజుజంగు బహాదురు గారికి. జిల్లారైతుల పక్షమున మౌల్వీ గులాం అహమదుసా॥ అర్పించుకొనిరి ప్రధానామాత్యులకు నిజామాబాదు పురపాలకసంఘ పక్షమునను, సాహుకారుల, వ్యాపారుల పక్షమునను స్వాగతపత్రము లొసగబడెను

సర్ అక్బరు రైతుల సన్మానపత్రమునకు ప్రత్యుత్తర మొసగుచు నిజాంసాగరు నియమములు రైతులకు సౌకర్యములను కలిగించునట్టివిగా మార్చుటకు ప్రభుత్వమువారు ఆలోచించుచున్నారనియు సన్మానపత్రమునందు వివరింపబడిన రైతుల కష్టములు త్వరలో నే స్థాపింపబడనున్న పంచదార కర్మాగారము వలన నివారణమగుననియు, వ్యవసాయ, సహకార సమస్యలనుగూర్చి ప్రభుత్వమువారు విచారించుచున్నారనియు, ఆయుర్వేద వైద్య సౌకర్యములను గ్రామీయులకు కలిగించుటకు ప్రభుత్వము యూనానీ ఆయుర్వేదముల కట్టికలో మొత్తమును ప్రత్యేకించినదనియు విద్యార్థి వసతిగృహ స్థాపనమునుగూర్చి సూచనను విద్యాశాఖవారు సానుభూతితో విచారించెదరనియు తెలిపిరి. గ్రంథాలయ స్థాపనమునుగూర్చి, జాగీరు రైతుల సౌకర్యములనుగూర్చి ప్రధానామాత్యులాలోచించెదమని వాక్రుచ్చిరి.

రైతుల ఈ సన్మానపత్రము సమర్పించుకొను విషయము మొదట విచారణ గాకున్నను, గులాంఅహమదు సా॥ "గొంగళ్ళను ధరించు రైతుల వాచనములను తెలుపుకొనుటకవకాశము ప్రసాదించుడు" అని ప్రధానామాత్యులను ప్రార్థించుటతోడనే వారు తమ అంగీకారమును తెలిపిరి

## కడపటి వార్తలు

Printed and Published at the Golkonda Power Press Hyderabad, Editor M. Balakrishna Reddy